# వైదిక అర్థనీతి



గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ




ఈశా వాస్య మిదగ్ం సర్వం
యత్ కించ జగత్యాం జగత్ ।
తేన త్యక్తేన భుంజీథా
మాగృధః కస్య స్విద్ధనమ్ ॥
(యజు. 40-1)

(ఈశావాస్య మిదగ్ం సర్వం) ఈ దృశ్యమాన బ్రహ్మాండ మంతయు సర్వమును నియమించు ఈశునిచే-పరమేశ్వరునిచే వ్యాప్తమై యున్నది. (యత్ కించ జగత్యాం జగత్) గతి శీలమైన ఈ జగత్‌లోని సమస్త చరాచర ప్రాణులుకూడా ఆ ఈశునిచేతనే వ్యాప్తమై యున్నవి. (తేన త్యక్తేన భుంజీథాః) అందుచేత త్యాగ బుద్ధితో - అనాసక్త చిత్తముతో వీటి ననుభవింపుము. (మాగృధః కస్య స్విద్ధనమ్) ఎవరి ధనమును అపహరింపకుము.




# వైదిక అర్థనీతి

అనుకర్త :

టి. సూర్యనారాయణ

ప్రకాశకులు :

గాయత్రీ ఆశ్రమము (ట్రస్టు)

వ్యాసనగర్, సీతాఫలమండి, సికింద్రాబాద్

గాయత్రీ గ్రంథమాల - 4

ప్రతులు : 2000

సృష్టి సంవత్సరము : 197, 29, 49, 092

దయానందాబ్దము : 167

ప్రజోత్పత్తి, దయానంద జయంతి, 1992

**మూల్యము : రు. 2-00**

(పోష్టు ఖర్చులు అదనము)

ప్రతులకు :

1. గాయత్రీ ఆశ్రమము
   12-10-586/6, వ్యాస్‌నగర్,
   సీతాఫలమండి, సికింద్రాబాద్-500 361

2. వైదిక సాహిత్య భండార్,
   ఆర్య సమాజము, సుల్తాన్ బజార్,
   హైదరాబాద్ - 500 001

3. శ్రీ మాశెట్టి వెంకటేశ్వరరావు,
   స్వస్తిక్ మెటల్ ప్రొడక్ట్స్, 3-3-738,
   కంచరి బజార్, సికింద్రాబాద్ - 500 003

ముద్రణ :

అమర్‌నాథ్ ప్రింటర్స్,

సీతాఫలమండి, సికింద్రాబాద్

# విషయ ప్రవేశము

ఓం శతహస్త సమాహర సహస్ర హస్త సం కిర ।
కృతస్య కార్యస్య చేహ స్ఫాతిం సమావహ ॥
(అథర్వ 3-24-5)

"నూరు చేతులతో-నూరు విధములుగా ధర్మ మార్గమున ధనము నార్జించి వేయి చేతులతో - వేయి విధములైన ధర్మ కార్యములలో (లోకహిత కార్యములలో) దానిని వితరణ చేయవలె"నని వేద సందేశము. మానవ జన్మ బహు మూల్యమైనది. ఇది కర్మయోని. లక్షల జీవ జాతులలో మానవుడొక్కడు మాత్రమే బుద్ధితో నాలోచించి ధర్మ కార్యముల నాచరించగలడు. ధర్మాచరణ వలన పుణ్యమును అధర్మాచరణము వలన పాపమును బొంది సుఖ దుఃఖముల ననుభవించును. చేసిన కర్మల ఫలము ఈ జన్మలో లభించకున్నను రాబోవు జన్మలలో తప్పక లభించునని - "అవశ్య మేవ భోక్తవ్యం కృతం కర్మ శుభా శుభమ్" అని ఋషుల సందేశం. ప్రారబ్ధం వలన కలిగిన ఈ శరీరంతో పురుషార్థం చేసి మానవుడు ఈ లోకమున అభ్యుదయమును పర లోకమున-రాబోవు జన్మమున ఇంతకన్నను ఉన్నతిని లేక పరమ శ్రేయస్సు అయిన ముక్తిని పొందగలడు.

మానవుడు పురుషార్థియై ధర్మ మార్గమున ధనమునార్జించుటలో కూడా కొన్ని నియమముల ననుసరించ వలసి ఉంది. లేకున్న అది యతనికి బంధనమగుటయేగాక పతితుని, పాపిని, లోభిని, ఇంద్రియ లంపటుని చేసి సర్వనాశనం చేయును. సామాజిక ప్రాణియైన మానవుడు సమాజ హితమునకు భంగం కలగకుండ తన ఉన్నతిని సాధించ యత్నించవలెను. తన అవసరమునకు మించిన సుఖ సాధనములను (విలాసములను) సంపాదించుట పాపమే యగును. అందుచేతనే ఋషులు యమములని చెప్పబడు 'అహింసా సత్య మస్తేయ బ్రహ్మచర్య

అపరిగ్రహము'లను సాంఘిక నియమములో 'అపరిగ్రహము'-
కాని పెట్టుకుండుటను చెప్పిరి. కనుక సమాజ హితమునకు భంగం కలుగ
కుండ సంపాదించవలెను. కాని దానిని వెంటనే వితరణ చేసి పుణ్యము
సాధించవలెను. ఎందుచేత ననగా ఆలస్యమైన మరణం ఎప్పుడు
వచ్చునో ఎవ్వరెరుగుదురు ? మహా భారతంలో చక్కటి ఉపదేశం
కలదు. అది ఏమన "విద్య, ధనములను నేను చిరకాలము జీవింతునని
నెమ్మది నెమ్మదిగా కూడ బెట్టవలయును. ధర్మము నాచరించవలసి
నపుడు మృత్యువుచే ఈడ్వబడుచున్నానని తొందరగా నాచరించ
వలెను."

మన దేశంలో మహా భారత కాలంనాటి వరకు వేద సిద్ధాంతాల ప్రచారం జరుగుతూ ఉండేది ప్రజలు సంయములై అపరిగ్రహ వ్రతాన్ని పాటిస్తూ ఉండేవారు. ఆనాడు కూడా ప్రజాస్వామ్య పద్ధతిలోనే రాజుల అధ్యక్షతలో పరిపాలన సాగుతూ ఉండేది. దోపిడీ, పరపీడనా లేని ఉత్తమ రాజ్య వ్యవస్థ ఉండేది. ఒక వర్గము యొక్క ఐశ్వర్యము పెరిగిపోతూ మరియొక వర్గము యొక్క ఐశ్వర్యం తరగిపోతూ ఉండేది కాదు ధర్మాత్ములైన రాజులు జైత్ర యాత్రలు చేస్తూ దొంగలను, దోపిడీగాండ్రను, అన్యాయకారులను అణచివేస్తూ ఉండే వారు. నేటి పుంజీ వాదానికి గాని, కమ్యూనిజానికి గాని ఆనాడు ఆస్కారం ఉండేదికాదు. కాని, మహా భారత యుద్ధానంతరం వైదిక ధర్మ ప్రచారం క్రమంగా తగ్గిపోతూ పుంజీవాదం బలపడటం మొదలైంది. ఒక వర్గము శ్రామికులను పీడించి వారి రక్తంతో లెక్కకు మించిన విలాస వస్తువులను సేకరించుకొని భోగ భాగ్యములతో తుల తూగుతూ ఉంటే మరొక వర్గం సరైన తిండికి, బట్టకి నోచుకోలేని నిరుపేదలై పోయారు. వివిధ మతాలకు చెందిన సాధువులు, సన్యాసులు,

మతాధిపతులు ఈ ధనిక వాదుల నాశ్రయించి మఠాలు, మందిరాలు, మసీదులు, చర్చీలు నిర్మించుకొని వారి వలెనే భోగ భాగ్యాల నను భవిస్తూ వారి ఉప్పు కారం తిన్నందుకు వారికే వత్తాసు పలికేవారు. బూటకపు కర్మ సిద్ధాంతాన్ని వల్లెవేస్తూ అమాయక ప్రజల మస్తిష్కాలను మత చరసాలలలో బంధించి వారి పబ్బం గడుపు కొనేవారు. దానికి ప్రతిక్రియగానే సామ్య వాదం- కమ్యూనిజం పుట్టింది. అది పుంజీ వాదంపైనే గాక మతాధిపతులపైన, మతాలపైన కూడా ధ్వజమెత్తింది. మతాలు ప్రగతికి అడ్డు గోడలని దుయ్యబట్టింది. విప్లవం విజయ వంతమైంది. కమ్యూనిజం రష్యా, చైనా దేశాలను వశం చేసుకుంది.

కారల్ మార్క్సుచే ప్రవేశ పెట్టబడిన ఈ ప్రత్యామ్నాయ కమ్యూనిజం పుంజీవాదం కన్నా, వంశపారంపర్య ఆధిపత్యం కన్నా ఎంతో మేలే. కాని ఇది మానవుని భౌతిక ఉన్నతి కొరకు సాయం చేసిందే కాని మానసికంగా, ఆత్మికంగా అణచి పెట్టింది. మానసికంగా బానిసను చేసింది భావ స్వాతంత్ర్యాన్ని, వ్యక్తి ప్రగతిని అణచి పెట్టింది. మూడు కోట్ల మందిని బలిగొని రెండు దేశాలలో తిష్టవేసిన కమ్యూనిజం, దాని నాయకులు తమ అధికారం, పదవులు నిలుపు కోటానికి సామ్యవాద రక్షణ విభాగాన్ని ఏర్పాటు చేసుకొని తమను, తమ కమ్యూనిజాన్ని విమర్శించిన వారిని చిత్ర హింసలకు గురిచేసి అమానుషంగా సంహరించింది. ఆ అమాయక బలి పశువుల సంఖ్య గణనకే అందకున్నది నేడు ఆ రష్యా దేశవాసుల కడుపుమంటే ఆ కమ్యూనిజాన్ని నాశనం చేసింది. ఒకప్పుడు ఆరాధ్య దేవతలుగా పూజింపబడిన వ్యవస్థా నిర్మాతలను నేడు అసహ్యించు కుంటోంది. వారి విగ్రాహాలను కూల ద్రోస్తోంది.

అయితే వేదం చెప్పే సామ్యవాదం మహోన్నతమైంది. అది మానవుని మనిషిగానే కాక దేవతగా తీర్చి దిద్దుతుంది. ధర్మాత్ముడిని చేస్తుంది. దయ, ప్రేమ, కరుణలను నింపుతుంది. వ్యక్తితో పాటు సమాజాన్ని ఉన్నత మార్గం వైపు నడుపుతుంది. వేదం 'సంగచ్ఛధ్వం సంవదధ్వం'- 'కలసి నడవండి కలిసి ప్రేమతో వార్తాలాపములు చేయండి' అని చెబుతుంది. 'దేవా భాగం యథా పూర్వం'- 'మీ పూర్వులు కష్టార్జితమును విభజించి స్వీకరించినట్లే మీరును చేయుడ'ని చెబుతుంది. 'సమానీ ప్రపా సహవో అన్న భాగః'- 'మీ అన్న పానీయాలు సమానముగా ఉండా'లంటుంది. 'అన్యోన్య మభి హర్యత వత్సంజాత మివాఘ్న్యా'- మీరు ఒండురులును నవజాత గోవత్సమును గోమాత ప్రేమించునట్లు తోటి వారిని సంస్కరించి ప్రేమతో లాలించి ఆదరించ మంటుంది. 'అక్షైర్మా దీవ్యః కృషిమిత్ కృషస్వ'- జూదరివి కావద్దు, వ్యవసాయదారుని వలె కష్టించి ఫలితం కోరమంటుంది. 'మోఘమన్నం విందతే అప్రచేతాః'- కష్టపడక అన్నమును పొంద గోరువాడు అప్రచేతుడు (సోమరి) యనియు, 'సత్యం బ్రవీమి వద ఇత్ స తస్య'- అట్టివానికి పతనము తప్పదనియు, అది సత్య మనియు చెబుతుంది. 'కేవలాఘో భవతి కేవలాదీ' తానొక్కడే ఒంటరిగా భుజించు వాడు అన్నమును గాక పాపమును భుజించు చున్నాడని చెబుతుంది. 'పర ఋణా సా వీరధ మత్కృతాని మాహం రాజన్ అన్యకృతాని భోజం'- 'నేను ఎవరికి ఋణ గ్రస్తుడను కాకుందును గాక, ఒకరి కష్టార్జితమును భుజింపకుందును గాక' యని సంకల్పము చేయమని చెబుతుంది.

ప్రాచీన ఋషులు, మునులు ఈ వేద ధర్మాన్నే ఆచరిస్తూ, ప్రచారం చేస్తూ ప్రజలను, పాలకులను తీర్చి దిద్దేవారు. ఆధునిక మహర్షి అయిన దేవ దయానందుడు ఈ వేద ధర్మాన్ని ప్రచారము

చేయడానికే తన సర్వస్వాన్ని అర్పించాడు. తన తరువాత కూడ వైదిక ధర్మ ప్రచారం జరగాలని 'ఆర్య సమాజ' మను సంస్థను స్థాపించి అద్భుతమైన పది సామాజిక సూత్రములను ఆ సమాజ నియమములుగా ఏర్పరిచాడు.

అసలు ఈ ధన మెవ్వరిది ? బుద్ధితో నాలోచించిన, ఎవరు ఏ వస్తువును నిర్మింతురో అది వారిది. ఈ ప్రపంచ పదార్థములలో దేనిని మనము నిర్మించగలము ? మన శరీరములనే నిర్మించుకోలేని అల్పజ్ఞులము, అల్ప శక్తిమంతులము నైన మనము భూ జలాగ్ని వాయు రాకాశములను నిర్మించ గలమా ? అవి లేని ఏ పదార్థము లోకమున నున్నది ? వాటిని మనము మన కనుకూలముగా మార్చుకొని కొన్ని సుఖభోగ వస్తువులను నిర్మించుకోగలమే గాని మూలకములను (Elements) మనము సృష్టించ గలమా ? ఇక రెండవ పక్షంగా లౌకిక పదార్థములైనా సమాజ, ప్రభుత్వాల సహకారం లేకుండా మనము నిర్మించుకో గలమా ? ఇట్టి అనేక ప్రశ్నలకు సమాధానమే ఈ లఘు గ్రంథము. తినబోతూ రుచి అడగ నేల ? మీరే చవి చూడుడు.

— కోడూరి సుబ్బారావు

# వైదిక అర్థనీతి

ఐశ్వర్యము, వైభవము, బంగారము, రత్నములు, ఇల్లు, భూమి ఇత్యాదివన్నీ 'అర్థము' - ధనము లో జేరును. వైదిక ప్రణాళికలో ఈ ఆర్థిక వ్యవస్థ ఎలా నిర్దేశించబడిందో పరిశీలించుట అవసరం.

నేడు ప్రపంచంలో సామ్యవాదము, వ్యక్తివాదము పేరిట వాదోప వాదాలు జరుగుతున్నాయి. రకరకాల ఆందోళనలు బయలు దేరినాయి. ప్రపంచ దేశములన్నీ ముఠాలుగా చీలిపోయి మారణ హోమానికి పాల్పడుతున్నాయి.

'ధనముపై హక్కు ఎవరిది?' ఈ ప్రశ్న సర్వత్రా వినబడు తున్నది. ఈ యాజమాన్య సిద్ధాంత విషయంలో వేదనిర్ణయ మేమిటో తెలుసుకుంటే ఈ సమస్యకు సరైన పరిష్కారం సాధ్యమవుతుంది.

## ధన మెవ్వరిది?

వేదములో 'కస్య స్విద్ధనమ్' (యజు 40-1) అనే వచన మున్నది. 'ధన మెవ్వరిది?' అని దీని అర్థం 'కస్య స్విద్ధనమ్'లో 'స్విత్' శబ్దము మహత్వ పూర్ణమైనది. 'స్విత్ ప్రశ్నేచ వితర్కేచ' అమరకోశము ౩-౨౪౧ స్విత్ శబ్దము ప్రశ్న మరియు వితర్కము. ధన మెవ్వరిది అనుట ప్రశ్న. దీనికి సమాధానముగా అన్ని పక్షములను చర్చించుట వితర్కము.

ధనము వ్యక్తిదా? సమాజ పరమైనదా? పాలకునిదా? ఇత్యాది ప్రశ్నలకు సమాధానం గురించి ఆలోచించడమే పై 'ప్రశ్న' ఉద్దేశం.

'స్వత్' నకు నిశ్చయమనే అర్థం కూడా ఉంది. కః శబ్దము ప్రజాపతికి వర్తించును ప్రజలను పాలించువాడు ప్రజాపతి (ప్రజాపతిర్వైకః) ఈ అర్థము ననుసరించి ధనమంతా ప్రజాపతికి చెందును. 'కస్య స్విద్ధనమ్' అను వచనానికి ప్రశ్న, వితర్కము, నిశ్చయము అను మూడు అర్థములు కలుగుతున్నాయి.

'ధనం' కల్గియున్నవాడు ఆ 'ధనం' తనదే నంటున్నాడు. అతని సంతానానికి సంక్రమించే ఆ ధనమునకు వారే యజమానులవుతున్నారు. దొంగలు, బందిపోట్లు తాము దోచుకొనిన ధనంపై సర్వాధికారాన్ని చలాయిస్తున్నారు. ఇలా అనేకులు ధనంపై తమ యాజమాన్య అధికారాన్ని ప్రకటించుకొంటున్నారు. అందుకే వేదం 'కస్య స్విద్ధనమ్' ప్రశ్నతో యాజమాన్య అధికారాన్ని వివరించబూనుకొన్నది.

ధనమును రక్షించుకొనే శక్తి తనకు తన కుటుంబమునకు కలిగియున్నప్పుడే అతని ధనం అతనివద్ద కొంతకాలము ఉండగలదు. అతని వద్దగల ధనమును ఎవరైనా బలవంతుడు కొల్లగొట్టినా ఆ బలవంతుడు మరణించిన పిదప అట్టి ధనం ఇక్కడనే పడివుంటుంది. అందుకే ధనం దుర్బలునిది కానట్లే బలవంతునిదీ కాదు.

కర్షకుడు తాను వ్యవసాయం చేయుట ద్వారానే ధనముత్పన్నమవుతోంది. కావున ఆ ధనం తనదిగా భావించును. అట్లే కార్మికుడు, తన శ్రమచేతనే 'ధనం' ఉద్భవిస్తోంది కాబట్టి ఆ ధనానికి తనే హక్కుదారునిగా నుండగోరును. పెట్టుబడిదారుడు తన పెట్టుబడి చేతనే ధన ప్రాదుర్భావము జరుగుతోందని, ఆ కారణంగా ధనంపై తన యాజమాన్య ముండాలని తలంచును.

క్షత్రియుడు తన బలంచేతనే సంపద రక్షించ బడుతుంది కావున ఆ ధనమునకు తానే యజమాని నను వైశ్యుడు తన వ్యాపారంచేత ధన ముత్పన్నమవుతుంది కాబట్టి ధనానికి తనే సర్వాధికారిగా భావించును.

ఇలా తమ పక్షమును సమర్థించుకోవడమే వితర్క మన బడుతుంది. 'స్విత్' శబ్దములో సు+ఇత్ అనే రెండు పదము లున్నాయి. 'సు' అనగా మంచి 'ఇత్' అనగా ప్రగతి, అధ్యయనము, జ్ఞాన సంపాదనము అని అర్థములున్నవి. ఉత్తమ ప్రగతి, ఉత్తమ జ్ఞాన సాధకమే ధన మనబడుతుంది.

అన్ని కలహాలకు-యుద్ధాలకు మూలము-కారణం ధనమే. అందుచేత వేదంలో యుద్ధమును 'మహా ధన' మని ఉటంకించ బడింది. యుద్ధాలు నివారించుటకు, ప్రజలు సుఖముగా ఉండుటకు 'యాజమాన్య నిర్ణయం' అవసరం. ఈ విషయంలో నిష్పాక్షికమైన నిర్ణయము చేయుటకు వేదం ఈ చర్చను ఆరంభించింది.

## ధన విభజన :

వేదములో యుద్ధమునకు 'వాజసాతా' అనే పేరున్నది. 'వాజసాతా' అనే శబ్దానికి ధన విభాజన అనే అర్థ ముంది. ధనమును విభజించినప్పుడు కలహాలు కల్గుతున్నాయి. అందువలన ధనముపై యాజమాన్య మెవరిదనే అంశమును శాంత చిత్తముతో ఆలోచించవలసి ఉన్నది.

అనేకులు తామే ధనముపై యజమానులమని భావించు కొనుట గమనించినప్పుడు, ఆ ధన మే ఒక్కరిదీ కాదని తేలిపోతుంది.

ఒక సుల్తాను అనేక దౌర్జన్యములు చేసి అపరిమితమైన ధనమును సంపాదించాడు. మరణ సమయమున తా నార్జించిన ధనమును తెప్పించుకొని తన వద్ద నుంచుకొని యేడ్వ మొదలిడెను. అట్టి ధనమును తాను ఇచ్చటనే వదలి వెళ్ళవలసి వచ్చుచున్నదని బాధపడినాడు. ఆ ధనమునకు తాను యజమానిని కాదని అతడు చాలా ఆలస్యంగా గుర్తించాడు.

ధనవంతులు, పెట్టుబడిదారులు కూడబెట్టిన ధనము వారు నిస్సంతాను లైనపుడు అట్టి సంపద పాలకుల పాలవుతోంది అందుచేత వేదము 'కస్య ప్రజాపతే స్విత్ ధనం' అని నుడువుచున్నది.

ఒకే మంత్రములో ప్రశ్న మరియు సమాధానము కలదు. కః అనగా ఎవ్వరనియు- కః అనగా ప్రజలకు సుఖమును కలిగించు పాలకుడనియు అర్థం కలుగుచున్నది. ఇట్టి ధనం ప్రజాపాలనకే గాని తన సుఖ భోగముల గురించి కాదు. సుఖ సంతోషములు వృద్ధియగునట్లు పాలించువాడు మాత్రమే కః అనబడతాడు. 'విష్ణు'- ప్రజాపాలన గావించును. అందుచేతనే అతని వద్ద మహాలక్ష్మి- అధికమైన ధన సంపద వుంటుంది.

## ప్రజల సుఖమే ముఖ్యము :

ప్రజాహితము ముఖ్యము. వ్యక్తి హితము గౌణముగా పరిగణింపబడుతుంది. ప్రజాహితము కొరకు రోడ్లు వెడల్పు చేయునప్పుడు లేక రోడ్లు వేయునప్పుడు వ్యక్తులు తమ ఇండ్లను లేక స్థలములను వదులుకోవలసి వస్తుంది. సార్వజనీనమైన కార్యములకు ఆటంకము కలుగనంత వరకే 'వ్యక్తి' స్వాతంత్ర్యము నిలుస్తుంది. దీనిని బట్టి సమాజ క్షేమమే ప్రధానమని తెలుతుంది.

ప్రభుత్వము వసూలు చేసే పన్నులు కూడా దీనినే సమర్థించు చున్నవి. సామాన్య పన్నులు, విశేష పన్నులు, అత్యంత విశేష పన్నులని పన్నులు మూడు రకాలుగా ఉంటాయి.

సామాన్య పన్నులు షష్ఠాంశము అనగా 15, 16 శాతము, విశేష పన్నులు 50 శాతము, అత్యంత విశేష పన్నులు 90 శాతము వరకు వసూలు చేయబడడం మనకు తెలుసు. దీనివలన 'ప్రజాపతేః కస్య స్విద్ధనమ్' అనగా ప్రజాపాలకునికే ధనముపై యాజమాన్య అధికార మున్నదని స్పష్టమయిపోయింది.

యుద్ధ సమయాల్లో ప్రజలనుండి ప్రభుత్వము అత్యధికంగా ధనం వసూలు చేస్తుంది. ప్రజా పాలనకై, రక్షణకై ప్రభుత్వము ప్రజల నుండి ధనము వసూలు చేయుట సమంజసమేనని ఆర్థికవేత్తలు అంగీకరించారు. ఇప్పుడు తేలిన అంశ మేమనగా :

1. ధనము వ్యక్తికి చెందినదికాదు.
2. ధనము ప్రజాపాలకునిది.
3. ధనమును ప్రజల సుఖాభివృద్ధికే పాలకులు వినియోగించాలి; స్వలాభం కోసం కాదు.

ఈ విషయాలను దృష్టిలో ఉంచుకొని వేదం 'మాగృధః' ఆశ పడవద్దు - అని ఆదేశిస్తున్నది.

**మాగృధః :**

మానవుడు ధనమును ఆశిస్తాడు. తన సుఖ సంతోషాలకై ఆ ధనమును వినియోగిస్తాడు. ఒక వ్యక్తి తన సుఖం కొరకై ధనమును వినియోగించినపుడు ఇతరులు అట్టి సుఖసంతోషాలతో వంచితులవుతారు.

తత్ఫలితంగా వారు ధనవంతుని ద్వేషిస్తారు. తత్పరిణామంగా వర్గ పోరాటం సంభవించి వినాశనానికి దారి తీస్తుంది. అందుకే వేదం 'ఆశ తగదు' అని హెచ్చరిస్తున్నది.

మనిషి తాను జీవించడానికి అవసరమైన ఆహారము, వస్త్రములు సమకూర్చుకొనవచ్చును. ఇందులో దోషమేమీ లేదు. కాని అవసరానికి మించి ఆర్జించుట, కూడబెట్టుకొనుటను వేదము అంగీకరించదు. అందుకే 'అపరిగ్రహ'మును పాటించవలసిందని వేదం ఉపదేశిస్తున్నది. 'మాగృధః' శబ్దానికి అర్థమిదే. అతిగా ఆశించవద్దని చెప్పడమే వేదముల ఉద్దేశం.

ఉదాహరణకు ఒక మనుష్యుడికి ఒకటి రెండు చొక్కాల అవసరముండగా డజన్ల కొద్ది చొక్కాలను కుట్టించుకొని కూడ పెట్టుట అత్యాశ అనిపించుకుంటుంది. ఈ విధమైన సంపద కేంద్రీకరణే సమాజంలో అగ్ని రగిలిస్తుంది. కొందరు 'మాగృధః కస్య స్విద్ధనమ్'ను ఒకే వాక్యంగా పరిగణించి యితరులు ఆశపడవద్దు అని వ్యాఖ్యానం చేస్తున్నారు. అలా అయితే కోటీశ్వరులు తమ ధనముపై తమదే హక్కుగా భావించి సంపద కేంద్రీకరణకు పాల్పడతారు. ధనవంతులు-నిర్ధనుల మధ్య వ్యత్యాసాలు పెరిగి వైషమ్యాలకు ఆస్కారం కలిగితే సమాజంలో మిగిలేది అశాంతే.

వ్యక్తి మానసిక ప్రవృత్తిని మార్చడం ద్వారా ధార్మిక సౌహార్ద సౌభ్రాతృత్వ సమసమాజాన్ని స్థాపించుకోవాలని వేదం అభిలషిస్తోంది. రక్తపాతం ద్వారా కలిగే అరాచకానికి 'ప్రవృత్తిని మార్చడం' అనే ప్రత్యామ్నాయాన్ని వేదం చూపిస్తోంది.

## త్యాగబుద్ధితో ధనము వాడుకొనుట :

'తేన త్యక్తేన భుంజీథా' త్యాగబుద్ధితో ధనమును అనుభవించ వలెనని వేదం ఆదేశిస్తోంది. ఇచట త్యాగమనగా దానమని అర్థం. మనిషిలో త్యాగభావనే ఏర్పడితే సమాజం సుఖశాంతులతో వర్ధిల్లుతుందనే వేద ప్రబోధం, ఆదర్శ సమాజ నిర్మాణానికి పునాది.

మనుష్యుని ఇంద్రియము లనుభవించు సుఖము పరిమితము. మన ఇంట్లో చేసిన లడ్డూ, జిలేబి ఇత్యాది పదార్థములు కొంతవరకు మాత్రమే తినగలము. అధికంగా తిన్నచో శరీరానికి బాధ కలుగక తప్పదు. మనుష్యుని ఇంద్రియములు కొంత సుఖము ననుభవించి తర్వాత అలసి పోతాయి. ఇది ధనమును తానే అనుభవించుటతో పోల్చవచ్చును.

ఇక దానపూర్వకమైన పద్ధతిని పరిశీలిస్తే మనమెంతవరకు దానం చేయదలచుకొన్నామో అంతవరకు చేసే అవకాశముంది. వంద మందికి మృష్టాన్నము పంచవచ్చును. వేయి మందికి పంచవచ్చును. వారి ముఖములలో కనిపించు తృప్తి, సంతోషము మన కపరిమితమైన ఆనందాన్ని కలిగిస్తాయి. ఆస్పత్రులు, ధర్మశాలలు, అనాథ శరణాలయాలు మొదలగున వెన్నైనా నడపవచ్చును. విద్యా దానం, అన్న దానం ఇలా ఎంతైనా చేయవచ్చును. వ్యక్తి తన సుఖముతో పాటు సమాజ సుఖము నాకాంక్షించి దాన మొనర్చిన అభౌతికానందం కల్గుతుంది.

ఇప్పటి వరకూ మనం విశ్లేషించిన 'తేన త్యక్తేన భుంజీథా మాగృధః కస్య స్విద్ధనమ్' త్యాగభావంతో ధనము ననుభవించుమని, ధనముపై అత్యాస తగదని, ధనము ప్రజాపాలకునిదని ప్రబోధించిన వేద వాక్యములలో స్పష్టమైన ఒక ఆర్థిక వ్యవస్థ గోచరిస్తోంది. ఇది

మనిషిని పరస్పరం చంపుకునే ఆర్థిక వ్యవస్థ కాదు. మనిషి సాటి మనిషిని బ్రతికించే వ్యవస్థ. ప్రగతి పథంలో మానవ జాతిని నడిపించే మహోత్కృష్ట వ్యవస్థ.

## వ్యక్తి సమాజంలో ఒక అంగము :

వేదం 'జగత్యాం జగత్' (యజు 40.1) అని ఉపదేశిస్తోంది. 'జగత్' అనగా గతి గలిగినదని అర్థము. జగత్తులో చలనశక్తి ఉన్నది. అది 'ప్రగతి' గలిగినది. విశ్వంలో యే వస్తువూ తిరగకుండా లేదు, ఉండదు. అందుకే దీనిని 'జగత్' శబ్దంతో సంబోధించడం జరిగింది.

గతి శబ్దమునకు ప్రగతి అని అర్థం చేసినపుడు కేవలం మానవుడు మాత్రమే ప్రగతి శీలుడుగా గుర్తించబడతాడు. కేవలం మనష్యునిలో మాత్రమే స్వతంత్ర బుద్ధి ఉంది. అందుచేత అతడు అత్యున్నత దశకు చేరగలిగే అవకాశముంది. అలాగే ఆ బుద్ధి పెడత్రోవ పడితే అతి నికృష్ట దశకైననూ దిగజారగలడు. ఇతర ప్రాణులలో ఈ రకమైన ప్రవృత్తి లేదు. ఎలా జన్మించాయో అలాగే ఉండిపోతాయి. వాటిలో యే విధమైన ఉత్కృష్టదశ రాదు. విశ్వాంతర్గతమైన అన్ని వస్తువులూ 'జగత్' శబ్దంతో సంబోధించబడినప్పటికీ పూర్ణరూపంలో మానవుడు మాత్రమే 'జగత్' అనబడతాడు.

వ్యక్తి స్థిరమా లేక సమాజం స్థిరమా ? అని ఆలోచించినపుడు ; వ్యక్తి మరణిస్తాడు కాని సమాజం అలాగే కొనసాగుతుందని తేలుతుంది. అందుచేత స్థిరమైన సమాజానికే ధనయాజమాన్యం చెందాలని నిర్ణయించడం సమంజసం.

ఇక్కడ మరో ప్రశ్న. ధనము సమాజంలోని ప్రజలదా ? లేక ప్రజాపతిదా ? ప్రజాపతి-పాలకుడు మారుతుంటాడు. సమాజం స్థాయి

రూపంలో స్థిరంగా ఉంటుంది. మానవ సమాజం ప్రధానము ప్రజా పాలకుడు గౌణము. మొదట మానవ సమాజం ఏర్పడింది. రక్షణ కొరకు ప్రజాపాలన కొరకు పాలకుడు ఎన్నుకోబడ్డాడు. 'రాజు' వ్యవస్థ తరువాత ఏర్పడినట్టిది. "విరాడ్ వా ఇదమగ్ర ఆసీత్" (అథర్వ 15)

'కస్య స్విద్ధనమ్' అనునప్పుడు యీ ధనం ప్రజాపాలనకై మాత్రమే వినియోగపడునదని స్ఫురించును. రాజులను ప్రజలు మార్చవచ్చు. దుర్మార్గుడైన శాసకుని తొలగించి ఉత్తమ పాలకుని నియమించుకోవచ్చు.

'హస్తోష్పతే ప్రతాపం నిరతక్షన్' ఋ 10-61-2- రాజసూయ యాగము ఇందు కొరకే యేర్పర్చ బడింది. ఇందులో శాసకుని ఎన్నిక జరుగుతుంది. శాసకుడు ప్రజల కొరకే ధనమును వినియోగపరచాలి కాని తాను ఉపభోక్త కారాదు. పాలకుడు ఆదరణీయుడు, బలశాలి, వందనీయుడు కావాలి. కాని ప్రజాకంటకుడుగా మారినప్పుడు ప్రజలే అతనిని తొలగిస్తారు. ధనమును సమిష్టిగా గుర్తించినప్పుడు వ్యక్తి ధనముపట్ల అత్యాశను కలిగియుండడు.

సమిష్టి ఆధారముగా వ్యష్టి-సమాజం ఆధారంగా వ్యక్తి. 'జగత్యాం' సప్తమీ విభక్తి. సప్తమీ విభక్తికి ఆధారము, ఆశ్రయము, నివాసమనే అర్థాలున్నాయి. అందుచేత జగత్ జగతీపట్ల ఆదరాభిమానాలు కల్గి ఉండాలి. వ్యక్తి సమాజము కొరకు త్యాగం చేయడంలోనే సమాజ హితమూ, వ్యక్తి హితమూ కలిసి ఉన్నాయి.

వ్యక్తి వికాసమునకు-సంక్షేమానికి సమాజము దోహదం చేస్తుంది. అందుకే వ్యక్తి సంఘం పట్ల కృతజ్ఞుడై ఉండాలి. వ్యక్తి కుటుంబములో అంగమైనట్లే జాతిలోనూ ఒక భాగము. వ్యక్తి వికాసము కొరకు జాతి-దేశము చాలా శ్రమ జేశాయి. అందుకే జాతికి-సమాజానికి మానవుడు

ఋణపడి ఉంటాడు. వీటన్నింటినీ దృష్టిలో పెట్టుకొని వేదం 'జగత్యాం జగత్' అని ఘోషిస్తోంది.

శిష్యుడు గురువు యొక్క ఆశ్రమంలో ఉండడం చేత అతడు గురువు పట్ల నతమస్తకుడై ప్రవర్తిస్తాడు. అలాగే బాలకుడు తల్లి దండ్రుల ఆశ్రయముతోనే పెరిగి పెద్దవాడవుతాడు. అందుకే బాలుడు తన మాతా పితరుల సేవిస్తాడు. అట్లే వ్యక్తి సమాజ ఆశ్రయములో జీవిస్తాడు. అందుకే సంఘంపట్ల ఋణపడి యుంటాడు.

నేడు వ్యక్తి ధనము కూడబెట్టు కొనుటలో ఉత్సుకతను ప్రదర్శి స్తున్నాడు. ప్రభుత్వము, పన్నుల ద్వారా వ్యక్తి దగ్గరున్న ధనమును వసూలు చేస్తోంది. కొంత మంది స్వార్థపరుల దగ్గర కోట్లాది ధన సంపత్తులు మూల్గుతున్నాయి. మరి కొందరు కూటికి లేని పస్థితుల్లో బ్రతుకు భారాన్ని ఈడుస్తున్నారు. ఈ రకమైన అసమానతే సమాజ నాశనానికి హేతువుగా పరిణమించే పరిస్థితి రాక తప్పదు. వ్యక్తి త్యాగ భావనతో ధనమును వినియోగిస్తే వర్గ పోరాటానికి తావుండదు ధన మంతా సమాజపరం కానంతవరకు 'సమస్య' పరిష్కరించబడదు. ఈ రకమైన వైదిక అర్థవ్యవస్థ యేర్పడితే సమాజంలో కలతలు, కలహాలు నశించి పోతాయి. ప్రాచీన కాలంలో అనేక విధములైన యజ్ఞములు చేసేవారు. అందులో 'సర్వమేధ' మొకటి. అందులో 'తన' ధనమంతా ప్రజాహిత కార్యములకు అర్పణ చేయడం జరిగేది. నాడు వ్యక్తి తాను సంపాదించిన ధనం సమాజానిదే నని భావించడం గమనార్హం.

పెట్టుబడిదారీ విధానంలో వున్న 'మత్స్యన్యాయం' వైదిక ఆర్థిక వ్యవస్థలో లేదు. త్యాగ పూర్వకమైన అర్పణ భావమే సర్వ సమస్యలకూ పరిష్కారం కాగలదు.

'ఈశావాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్
తేన త్యక్తేన భుంజీథా మాగృధః కస్య స్విద్ధనమ్'

ఈ వేదమంత్రాధారంగానే ఇంతవరకు మనం అర్థవ్యవస్థ మరియు యాజమాన్య సిద్ధాంతమును గురించి చెప్పుకొన్నాము. అట్లే ఈ మంత్రమును వ్యక్తిగత జీవనమునకు అనగా శారీరక మానసిక నియంత్రణకు ఉపయోగముగా అన్వయించుకోవచ్చు.

ఇందుగల 'ఈశ' శబ్దమునకు ఈశుడు అనగా శాసించువాడు, యజమాని, శక్తివంతుడు, స్వామి అను అర్థం వచ్చును. 'ఈశావాస్యం' అను ఈ వచనంలో వాస్యం అను క్రియ కలదు. దీనికి శక్తివంతుడైన వాడే ఇట నిలుచును. ఈ లోకమును స్థిరపరచుకొనును, చక్కబెట్టుకొనును అని భావం. ఆత్మకు ఈ శరీరము వస్తువు - నివసించు స్థానం కనుక ఈ శరీరమునకు పాలకుడు - శాసించువాడు ఆత్మయే.

శరీరమును ఒక రాష్ట్రముగా యెంచినపుడు ఇందుగల అణుజీవులే ప్రజలు. ఇవి దేనికది స్వతంత్ర రూపములో పుట్టుచు, పోషింపబడుచు, గిట్టుచుండును. ఈ శరీరక్షేత్రంలో ఇంద్రియములను 33 గురు దేవతలు ప్రాంత అధికారులుగా పనిచేయుదురు. ఒక్కొక్క ఇంద్రియం ఒక్కొక్క ప్రాంతముపై అధికారం వహించును. అచట ఆ ఇంద్రియ దేవతలు చేయు శుభకర్మలే యజ్ఞాలు. అందుచేత ఈ శరీరం 'దేవతా దేవయజనం కురుక్షేత్రం, దేవతలు యజ్ఞం చేయు పవిత్ర క్షేత్రముగా నెంచబడింది.

అప్పుడప్పుడు కామక్రోధాది రాక్షసులు ఈ క్షేత్రంపై దాడి సలిపి యజ్ఞకార్యమును ధ్వంసము చేయపూనుకొందురు. అట్టి శత్రువులబారి నుండి తప్పించి ఆత్మ-రాజు దీనిని రక్షిస్తారు. ఈ విధంగా శతవర్ష యజ్ఞమును నిర్విఘ్నముగా పూర్తి చేయును.

కావున మనుష్యుడు పై మంత్రమును సదా స్మరిస్తూ నేను అనగా ఆత్మను ఈ శరీరమునకు రాజును. దీనిని నేను శక్తివంతముగా సమర్థవంతముగా పాలించెదను, నియమబద్ధంగా నడిపించెదను. ఇంద్రియములను వశమందుంచుకొని నా యిష్ట ప్రకారమే పాలించెదను అని నిశ్చయించుకొనవలెను. అదియును గాక ఈ శరీరము ఒక సమిష్టి ఆశ్రయము. ఇందు ఇంద్రియములు-అవయవములుండును. ఇవి మానవ సమాజములో వ్యక్తి వంటివి. అవయవములు శారీరకోన్నతికి కృషిచేయవలసి యుండును. శరీరమునకు నష్టము కలిగించు ఏ పనియు చేయరాదు. ఎందుకనగా శరీర సుస్థిరత్వం పైననే అవయవ సుస్థిరత్వం ఆధారపడి యుంది. కావున అవయవము స్వ సుఖ, భోగ ఆలోచనలకే వశము గాక శరీర సుఖముకై కొంత త్యాగము చేయాలి.

వ్యాయామము, ప్రాణాయామమువంటి వానిచే అవయవాలకు బాధ కల్గుతుంది. కాని శరీర ఆరోగ్యము కొరకు అట్టి బాధలు సహించక తప్పదు. అట్లే ఇంద్రియాలుకూడా శరీరమునకు హాని సంభవించకుండా సంయమముగా ప్రవర్తించాలి. ఇది శారీరక రాజ్య నియమం.

ఇలా వేద మంత్రమును అన్వయించుకొని వ్యవహరించినచో మానసిక శక్తి పెరిగి అనేక లాభములు చేకూరును. నేను రోగగ్రస్తుడనేమో అని సందేహించుట వలన కూడా వ్యక్తి రోగిగా మారే ప్రమాదము కలదు. నేను రోగ గ్రస్తుడను కాను, నన్ను రోగమేమియు చేయజాలదను దృఢ నిశ్చయము, ప్రబల ఇచ్ఛాశక్తి మూలంగా కూడా రోగి నిరోగి అయ్యే అవకాశము కలదు. ఇది మానసిక చికిత్సకు బీజము. ఆరోగ్యమును సాధించుటకు ఇదొక ఉపాయము. కావున మనస్సులో సదా సదాలోచనకు, మంగళ ప్రదమైన ఆలోచనలకు తావిచ్చినచో శరీరమే

కాకుండా సమాజములో కూడా మంచి పరిణామములు సంభవమని దీని భావం.

వైదిక వ్యవస్థ నిలిచియున్నంత కాలం మనుష్యు డీ విధంగా ఐచ్ఛికంగా తమకుతాము నియమించుకొని అటు సామాజికంగా, ఇటు వ్యక్తిగతంగా క్రమశిక్షణతో వ్యవహరిస్తూ పాలించుకొన్నందున అధికారులు, రక్షకభటులు విశేషంగా శ్రమించాల్సిన అవసరమేర్పడలేదు. అట్లే తమంతతామే మిగులు ధనాన్ని, 'ఇదన్న మమ' భావంతో ప్రభుత్వ కోశము నింపి సుఖశాంతులు పెంచుకున్నారని చెప్పుదురు.

శరీర ఆరోగ్య నిమిత్తము ఇంద్రియములు - అవయవములు వశమందుండుటకు దృఢమైన ఆత్మశక్తి ఎలా అవసరమో అట్లే ప్రజలలో నీతి, నియమము, సామాజిక దృక్పథము ఇత్యాది మంచి లక్షణాలు అలవడుటకు శక్తి సంపన్నుడు - సమర్థుడునై పాలకుడు అవసరం. పాలకుడు దుర్బలుడైతే దేశం శత్రుదాడుల నెదుర్కోవలసి వస్తుంది. ఆత్మ దుర్బలమైతే అరిషడ్వర్గాలు శరీరాన్ని పీడిస్తాయి.

కావున మన ప్రజలు అనుశాసనశీలురై ఇట్టి జీవనము గడుపుచు లోక కల్యాణము కొరకు ప్రయత్నింతురు గాక !

శమ్ ఇతి ఓ౩మ్

## వైదిక ధర్మో విజయతామ్

అందరు అనుసరించ దగిన

# సామాజిక నియమములు

౧. సమస్త సత్య విద్యలకును, విద్యవలన తెలియు సమస్త పదార్థములకును ఆదిమూలము పరమేశ్వరుడు.

౨. ఈశ్వరుడు సచ్చిదానంద స్వరూపుడు, నిరాకారుడు, సర్వశక్తిమంతుడు, న్యాయకారి, దయాళుడు, అజన్ముడు, అనాది, అనంతుడు, నిర్వికారుడు, అనుపముడు, సర్వాధారుడు, సర్వేశ్వరుడు, సర్వవ్యాపకుడు, సర్వాన్తర్యామి, అజరుడు, అమరుడు, అభయుడు, నిత్యుడు, పవిత్రుడు, సృష్టికర్తయునై యున్నాడు అతనినే ఉపాసించ దగను.

౩. వేదము సమస్త సత్య విద్యల గ్రంథము. వేదమును చదువుట, చదివించుట మరియు వినుట, వినిపించుట ఆర్యులందరికి పరమ ధర్మము.

౪. సత్యమును గ్రహించుటకును, అసత్యమును త్యజించుటకును ఎల్లప్పుడు సిద్ధముగా నుండవలెను.

౫. సకల కార్యములను ధర్మానుసారముగా అనగా సత్యాసత్యముల నాలోచించి చేయవలెను

౬. ప్రపంచమునకు ఉపకారము చేయుట ఈ సమాజము యొక్క ముఖ్యోద్దేశ్యము. అనగా శారీరకోన్నతికి, ఆత్మికోన్నతికి మరియు సమాజికోన్నతికి పాటుపడవలెను.

౭. అందరితో ప్రేమపూర్వకముగ, ధర్మానుసారముగ, యథాయోగ్యముగ వ్యవహరించవలెను.

౮. అవిద్యను నశింపజేసి, విద్యను వృద్ధి జేయవలెను.

౯. ప్రతి వ్యక్తియు తన యున్నతిలోనే సంతృప్తి నొందక అందరి యున్నతిలోనే తన యున్నతి కలదని తలంచవలెను.

౧౦. సర్వ హితకరములగు సామాజిక నియమములను పాలించుటలో పరతంత్రులై, వ్యక్తి హితకరములగు నియమములందు స్వతంత్రులగుట అందరికి తగును.

ఇవే "ఆర్య సమాజము" నకును నియమములు

Gayatri Series No 4
VEDIC ARDHANEETI

Rs. **2-00**

## మా ప్రచురణలు

| | | |
|---|---|---|
| 1. అగ్నిహోత్రము - వైజ్ఞానిక స్వరూపము | | 4.00 |
| (డా॥ కోడూరి సుబ్బారావు) | | |
| 2. వైదిక వైజ్ఞానిక సంస్కృతి | ,, | 4.00 |
| 3. మానవ ధర్మము | ,, | 3.00 |
| 4. గాయత్రీ మహిమ | ,, | 2.50 |
| 5. వైదిక క్రాంతి పథం | ,, | 5.00 |
| 6. చతుర్దశ భువనములు | ,, | 3.00 |
| 7. గోమాత | ,, | 5.00 |
| 8. యజ్ఞోపవీత వైశిష్ట్యము | ,, | 1.00 |
| 9. జనని-జన్మ భూమి (అచ్చులో) | ,, | |
| 10. యుగపురుషుడు శ్రీ కృష్ణుడు | | 6.00 |
| (సంధ్యావందనం శ్రీనివాసరావు) | | |
| 11. పురుషోత్తముడు - శ్రీరాముడు | ,, | 8.00 |
| 12. వైదిక వివాహ వైశిష్ట్యము (సంధ్యావందనం లక్ష్మీదేవి) | | 3 00 |
| 13. మాతా పుత్రికల జ్ఞాన చర్చ (లోక మల్హారి) | | 6.00 |
| 14. వైదిక అర్థనీతి (టి. సూర్యనారాయణ) | | 1.00 |
| 15. నమస్తే సమీక్ష | ,, | 1.00 |
| 16. దేవునకు మానవునకు మధ్య.... | ,, | 1.00 |
| 17. దగాపడిన హిందూ సోదరా | ,, | 1.00 |
| 18. దయానందుని ఆదర్శ రాజ్యము | ,, | 1.00 |
| 19. బ్రహ్మచర్య విజ్ఞానము | ,, | 15.00 |
| 20. వైదిక సంధ్యాగ్ని హోత్ర విధి | | 1.00 |

(పోష్టు ఖర్చులు అదనము)